

చాలా రోజుల నాటి సంగతి. ఒక దేశంలో ఒక అబ్బాయి ఉండేవాడు. అతడు ఎప్పుడూ కొత్త కొత్త విషయాల గురించి ఆలోచించేవాడు. వాటిల్లో చాలా వింతగా ఉండేవి.



అతడి పేరు శంకరయ్య.

వాళ్ల అమ్మ అతడిని తిక్క శంకరి

అని పిలిచేది. వాళ్ల నాన్న కూడా

అలాగే పిలిచేవాడు. అతడి పనులు

కూడా అలాగే ఉండేవి.

ఒక రోజు వాళ్ల నాన్న అతడికి

పాప్‌కార్న్ తెచ్చాడు. వాటిని

అతడు తిన్నాడని

అనుకుంటున్నారా? లేదు!









అతడు చాలాసేపు ఆలోచించాడు,
'నేను పిచ్చివాడిని కాదు
కాదని వాళ్లకి నిరూపిస్తాను.'
తరువాత అతడు పాప్‌కార్న్
తీసుకుని విత్తసాగాడు.





శంకరి వాళ్ల అమ్మ అడిగింది,
“పాప్‌కార్న్‌ని నేలలో
పెడుతున్నావేంటి, శంకరి?”
శంకరి ఇలా చెప్పాడు, “నేను
పాప్‌కార్న్‌ని విత్తుతున్నాను, అమ్మా.
నేను రోజూ వాటికి నీళ్లు పోస్తాను.
అప్పుడు పాప్‌కార్న్ పంట వస్తుంది.
అప్పుడు నాకు సంచులకొద్దీ పాప్‌కార్న్
దొరుకుతుంది.”





"ఓరి, తిక్క శంకరి," అమ్మ
అంది.
"ఓరోరి తిక్క శంకరి!"





"నువ్వు తిక్కలోడివి, తిక్క శంకరి.
తిక్కలోడివిగానే ఉంటావు,"
అన్నాడు తండ్రి.

ఒక రోజు శంకరి కూర్చుని దాని గురించి
బాగా ఆలోచించాడు. 'నేను పిచ్చివాడిని కాదు
కాదని వాళ్లకి నిరూపిస్తాను,' అనుకున్నాడు.
శంకరి ఇంటి పెరటివైపుకి వెళ్లాడు.
అతడి  దగ్గర ఉన్న పాత్రలో నీళ్లు ఉన్నాయి. ఆ
నీళ్లు చాలా, చాలా వేడిగా ఉన్నాయి! అతడు
రెండు ఎర్ర కోళ్లను పిలిచాడు.
ఆ వేడి నీళ్లని ఆ కోళ్లు తాగాలని
అతడి ఆలోచన.







"ఈ కోళ్లకు వేడి నీళ్లు తాగించాలని
ఎందుకు ప్రయత్నిస్తున్నావు?"
వాళ్ల అమ్మ అడిగింది.
"ఈ వేడి నీళ్లు తాగి అవి
ఉడకబెట్టిన గుడ్లు పెడతాయని,"
అని శంకరి బదులిచ్చాడు.
"ఓరి, తిక్క శంకరి," అమ్మ అంది.
"ఓరోరి తిక్క శంకరి!"





“నువ్వు తిక్కలోడివి, తిక్క శంకరి.
తిక్కలోడివిగానే ఉంటావు,”
అన్నాడు తండ్రి.

ఒక రోజు శంకరి అనుకున్నాడు,
‘నేను పిచ్చివాడిని కాదు
కాదని వాళ్లకి నిరూపిస్తాను,
నాకంటే పిచ్చివాళ్లని వాళ్లకి
చూపిస్తాను.’





శంకరి ఇంటి నుండి బయలుదేరి

నడవసాగాడు.





అతడు ఒక వాగు వద్దకు చేరుకున్నాడు.

అక్కడ ఒక మనిషి కనిపించాడు.

“మీరు ఏం చేస్తున్నారు?” శంకరి అడిగాడు.

“నేను నీళ్లు తీసుకెళ్లటానికి ప్రయత్నిస్తున్నాను,” అని అతని చెప్పాడు. “కానీ, ఆ పాత్రనిండా చిల్లులు ఉన్నాయి,” శంకరి అన్నాడు. “అవును,” అతడు బదులిచ్చాడు. “చిల్లులున్న పాత్రలో నీళ్లు తీసుకెళ్లటం చాలా కష్టం.”







"మీకు సాయం చేస్తాను," శంకరి అన్నాడు.

అతడు కొన్ని గడ్డి పరకలు,

కొంత మెత్తటి మట్టి తీసుకుని ఆ రంధ్రాలు

పూడ్చాడు.

"ఇప్పుడు మీరు ఈ పాత్రలో నీళ్లు

తీసుకుని వెళ్లవచ్చు," అన్నాడు శంకరి.



"చాలా, చాలా ధన్యవాదాలు!" అతడు
అన్నాడు.
"నువ్వు తెలివైనవాడివి,
ఎల్లకాలం తెలివైనవాడివిగా ఉంటావు."







అతడు శంకరికి ఒక బంగారు
గడియారం ఇచ్చాడు.



తరువాత శంకరి ముందుకు

నడుచుకుంటూ వెళ్లాడు.





కొంత దూరం వెళ్లిన తరువాత అతడికి

కొంతమంది కనిపించారు. వాళ్లు

విచారంగా ఉన్నారు. "మీరు ఇంత

విచారంగా ఎందుకు ఉన్నారు?"

శంకరి అడిగాడు. "నేను మీకు

సహాయం ఏమైనా చెయ్యగలనా?"



“మాలో ఒకరు తప్పిపోయారు,” వాళ్లల్లో ఒకడు చెప్పాడు. “మీరు ఎంతమంది ఉన్నారో లెక్కపెట్టుకున్నారా?” శంకరి అడిగాడు. “ఆ, లెక్కపెట్టాం,” అతను చెప్పాడు. “మేం తొమ్మిది మందే ఉన్నాం. ఉదయం పదిమందిమి బయలుదేరాం. మాలో ఒకరు తప్పిపోయారు.”

“మళ్లొకసారి లెక్కపెట్టి చూపించండి,” అన్నాడు శంకరి. అతడు లెక్కపెట్టటం మొదలుపెట్టాడు. “ఒకటి, రెండు, మూడు......” అతడు తొమ్మిదిమందిని లెక్కపెట్టాడు. తనని తాను లెక్కపెట్టుకోవటం మరిచిపోయాడు.



‘ఓహో!’ శంకరి అనుకున్నాడు.

‘అతడు తనని తాను లెక్కపెట్టుకోవటం మరిచిపోయాడు!’ శంకరి అతనితో అన్నాడు, “మీలో తప్పిపోయిన మనిషిని నేను తెప్పిస్తాను. మీరు నాకు ఏమిస్తారు?”

“మా దగ్గర ఉన్న డబ్బంతా నీకు ఇచ్చేస్తాం,” అని వాళ్లు చెప్పారు.

“సరే! ఇప్పుడు నేను మిమ్మల్ని లెక్కపెడతాను,” అన్నాడు శంకరి.

మొదటి మనిషిని ఒక దెబ్బ వేశాడు. చపాక్-ఒకటి అని లెక్కపెట్టాడు.

తరువాత రెండవ మనిషిని దెబ్బవేసి లెక్కపెట్టాడు. చపాక్-రెండు!

మూడవ మనిషిని లెక్కపెట్టాడు – చపాక్-మూడు!



శంకరి తన లెక్క కొనసాగించాడు –

చపాక్-నాలుగు! చపాక్-అయిదు!

చపాక్-ఆరు!



చపాక్-ఏడు! చపాక్-ఎనిమిది!

చపాక్-తొమ్మిది!



చపాక్-పది!





"భలే!" అన్నారు వాళ్లు.

"మనమందరం ఉన్నాం.

ఎవరూ తప్పిపోలేదు!"

"నువ్వు తెలివైనవాడివి,

ఎల్లకాలం తెలివైనవాడివిగా

ఉంటావు,"

అని వాళ్లు శంకరితో అన్నారు.

తరువాత వాళ్ల దగ్గర ఉన్న

డబ్బంతా శంకరికి ఇచ్చారు.





తరువాత శంకరి ముందుకు

నడుచుకుంటూ వెళ్లాడు.

అలా అతడు ఒక ఊరు

చేరుకున్నాడు.



అక్కడ అతడికి ఒక ఇల్లు కనపడింది.
'ఈ ఇల్లు చాలా వింతగా ఉందే!'
అనుకున్నాడు శంకరి.
'ఈ ఇంటికి ఒక్క కిటికీ కూడా లేదు!'
అప్పుడు ఆ ఇంటిలోంచి ఒక మనిషి
పరిగెత్తుకుంటూ బయటకు వచ్చాడు.
అతడి చేతిలో ఒక పాత్ర ఉంది.



తరువాత చాలా మంది ఆ ఇంటిలోంచి

పరిగెత్తుకుంటూ వచ్చారు.

అందరి చేతుల్లోనూ పాత్రలు ఉన్నాయి.





ఆ మనుషులందరూ తిరిగి

ఇంటిలోకి పరిగెత్తారు.

వాళ్లు ఇంటి బయటకి, లోపలికి

పరిగెత్తుతూనే ఉన్నారు.

"పాత్రలు ఖాళీగా ఉన్నాయి," శంకరి
అన్నాడు. "మరి వాటితో లోపలికి, బయటకి
ఎందుకు పరిగెత్తుతున్నారు?"
వాళ్లల్లో ఒకతను ఆగి ఇలా చెప్పాడు,
"ఈ ఇల్లు చాలా బాగుంది. అయితే లోపల
చిమ్మ చీకటిగా ఉంది. పాత్రల నిండా లోపలికి
సూర్యకాంతిని తీసుకెళుతున్నాం.
అయినా లోపల చీకటిగానే ఉంది,
ఏమీ కనపడటం లేదు."
"లోపలికి, బయటకి పరిగెత్తటం ఆపమని
వాళ్లకి చెప్పండి," అన్నాడు శంకరి.
"వాళ్లకి నేను సహాయం చేస్తానని చెప్పండి."





అప్పుడు శంకరి వాళ్లతో ఇలా

చెప్పాడు,

"మీరు చక్కని ఇల్లు కట్టారు.

కానీ ఒక్క విషయం మరిచిపోయారు.

మీరు మీ ఇంటికి కిటికీలు

పెట్టలేదు."

అప్పుడు వాళ్లు ఆ ఇంటికి

కిటికీలు చేశారు.

దాంతో ఇంటిలో చీకట్లు తొలిగిపోయి

సూర్యకాంతి పరుచుకుంది.



"భలే!" అన్నారు వాళ్లు. "నువ్వు తెలివైనవాడివి, ఎల్లకాలం తెలివైనవాడివిగా ఉంటావు," అని వాళ్లు శంకరితో అన్నారు.

తరువాత వాళ్లు ఇలా చెప్పారు,

"దయచేసి మా రాజుగా ఉండు."

వాళ్లు శంకరికి బంగారంతో చేసిన ఒక కిరీటాన్ని ఇచ్చారు.

"లేదు, నాకు మీ రాజు కావాలని లేదు," శంకరి చెప్పాడు. "కానీ బంగారంతో చేసిన మీ కిరీటం తీసుకెళతాను. మా అమ్మా, నాన్నలకు దీనిని చూపిస్తాను."



తరువాత శంకరి ఇంటికి వెళ్లాడు.





బంగారంతో చేసిన కిరీటాన్ని అతడి

అమ్మా, నాన్నలు చూశారు.

"శంకరి, తిక్క శంకరి. ఈ బంగారు

కిరీటం ఎక్కడిది?" అని వాళ్లు అడిగారు.



జరిగినదంతా శంకరి వాళ్లకి వివరించాడు.



బంగారు గడియారాన్ని నాన్నకి ఇచ్చాడు.



డబ్బంతా తల్లికి ఇచ్చాడు.





కానీ బంగారు కిరీటాన్ని మాత్రం తన దగ్గరే ఉంచుకున్నాడు.

ఎప్పుడూ దానిని పెట్టుకునే ఉండేవాడు.





చెట్లమీద ఊగుతున్నప్పుడు దానిని పెట్టుకుని ఉండేవాడు.





స్నానం చేసేటప్పుడు,



... చివరికి నిద్రపోయేటప్పుడు!

తరువాత అతడు తన తల్లికి, తండ్రికి ఇలా చెప్పాడు, "దయచేసి ఇక నన్ను తిక్క శంకరి అని పిలవకండి."

"కానీ, నీ పేరు అదే కదా," అమ్మ అంది.

"నీ పేరే తిక్క శంకరి," అన్నాడు నాన్న.

"కాదు, నా పేరు శంకరయ్య," శంకరి అన్నాడు. "తెలివైన శంకరయ్య."





తరువాత తెలివైన శంకరయ్య కూర్చుని ఆలోచించసాగాడు. 'ఆవు నేరుగా బాదం పాలు ఇచ్చే విధానం కనుగొనగలనేమో,' అనుకున్నాడు అతడు.

